| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ వందా రు | అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నిమిషా | ద్వైమాస | ? | సాంఘి | ౧౯౨౯ | లేదు? | ౧ | ౮ | ౦ | నెల్లూరు |
| నియోగి | మాస | దై. కోటీశ్వర శర్మశాస్త్రి కనుపర్తి మార్కండేయ శర్మగార్లు. | సాంఘి | ౧౯౨౦ | లేదు? | ౨ | ౦ | ౦ | చెన్నపురి |
| నీతిదర్పణము | మాస | ? | నైతి | ౧౯౧౫ | లేదు? | | ? | | నెల్లూరు |
| నీలగిరి | ౨౩ వార | హసబ్నిస్ నరసింహాచార్యులు గారు | రాజ | ౧౯౨౨ | ౧౯౨౯ | ౩ | ౮ | ౦ | నల్లగొండ (నైజా |
| నీలీప్రకాశిక | ౨౪ మాస | ? | పారి | ౧౮౮౫ | లేదు? | | ? | | చెన్నపురి |
| నెల్లూరుపత్రిక | ౨౫ వార | బిరుదవోలు జగదీశ్వర ప్రసాదరావు గారు | రాజ | ౧౯౨౦ | లేదు? | ౩ | ౦ | ౦ | నెల్లూరు |
| పంచాంగ | పక్ష | కాశీరామమూర్తిగారు | సాంఘి | ౧౯౧౫ | ఉన్నది | ౧ | ౮ | ౦ | సోంపేట |
| పత్రికాసార ప్రకాశిక | ౨౬ పక్ష | జోగినాథస్వామి సోదరులు | విద్యా | ? | లేదు! | ౧ | ౪ | ౦ | తుని |
| పదుగుంటు | ౨౭ పక్ష | గిడుగు వేంకట నరసింహారావుగారు | రాజ | ౧౯౨౮ | ౧౯౨౯ | ౧ | ౪ | ౦ | గుంటూరు |
| పద్మశా | మాస | సంఘము తరఫున | సాంఘి | ? | ఉన్నది | ౨ | ౦ | ౦ | ఎలమఱ్ఱు (కృష్ణా) |
| పద్మాక్ష | మాస | ? | ? | ? | లేదు! | | ? | | ? |
| పరపతి | పక్ష | గోవిందరాజు వేంకట కృష్ణరావు, తల్లాప్రగడ రామారావుగార్లు | ఆర్థి | ౧౯౨౫ | త్వర | ౨ | ౦ | ౦ | గుంటూ |
| పరోపకారిణి | మాస | యం. దావీదు గారు | మత | ౧౯౨౬ | లేదు? | ౦ | ౮ | ౦ | రామాయపట్నం |
| పల్నాటి | ౨౮ వార | శనివారపు సుబ్బారావు గారు | రాజ | ౧౯౨౩ | ౧౯౨౪ | ౩ | ౦ | ౦ | తెనాలి |
| పశ్చిమాంధ్ర | వార | జి. వి. పున్నయ్య శాస్త్రి గారు | రాజ | ౧౯౨౪ | వెంటనే | ౩ | ౦ | ౦ | కడప |
| పాఠశాలాపత్రిక | పక్ష | గుండు రాఘవ దీక్షితులు గారు | విద్యా | ౧౯౨౫ | ౧౯౨౬ | ౪ | ౦ | ౦ | గుంటూరు |
| పిల్లకాకితము | పక్ష | శ్రీనివాసులుగారు | వైజ్ఞా | ౧౯౨౫ | ౧౯౨౮ | ౧ | ౮ | ౦ | చెన్నపురి |
| పినాకినీపత్రిక | వార | పప్పూరి రామానుజాచార్యులు గారు | రాజ | [illegible] | లేదు? | ౩ | ౦ | ౦ | అనంతపురం |
| పుస్తక ప్రదాయిని | మాస | ? | వైజ్ఞా | ౧౮౮౫ | ౧౯౧౫ | | ? | | బందరు |
| పుష్కరిణి | మాస | చంద్రంగి రామారావు గారు | సాహి | ౧౯౨౫ | వెంటనే | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| పుష్పాంజలి | మాస | జొన్నలగడ్డ రాధాకృష్ణయ్య గారు | సారస్వ | ౧౯౩౧ | ఉన్నది | ౦ | ౧౨ | ౦ | వీరాస్వామివీధి |
| పుష్పమాల | మాస | శ్రీహనుమంతరావు గారు | సార | ౧౯౨౬ | వెంటనే | ౫ | ౦ | ౦ | బందరు |
| పోసు వర్తమాని | మాస | టి. కే. సుందరయ్యర్ గారు | వార్త | ౧౯౦౬ | లేదు? | ౧ | ౮ | ౦ | మదరాసు |
| ప్రకటనపత్రి | మాస | గుండు రాఘవదీక్షితులు గారు | వాణి | ౧౯౨౫ | ౧౯౨౬ | ౩ | ౦ | ౦ | గుంటూరు |
| ప్రకృతి | ౨౯ మాస | సి. హనుమయ్య గారు | వైద్య | ౧౯౨౬ | ఉన్నది | ౨ | ౦ | ౦ | బెజవాడ |
| ప్రజ | వార | ఖండవిల్లి రాజారావు గారు | రాజ | ౧౯౨౫ | లేదు! | ౩ | ౮ | ౦ | రాజమహేంద్రవరం |
| ప్రజాబంధు | మాస | ఆర్కాటు రంగనాథ మొదలియారు | రాజ | ౧౯౨౪ | ఉన్నది | ౧ | ౧ | ౦ | అడయారు |
| ప్రజాశక్తి | వార | గుళ్ళపల్లి వెంకటపున్నయ్య శాస్త్రి | రాజ | ౧౯౨౬ | వెంటనే | ౩ | ౦ | ౦ | కడప |
| ప్రజాహిత | మాస | ? | ? | ? | లేదు? | | ? | | సోంపేట |
| ప్రథమపాఠశాల | మాస | అయినంపూడి గురునాథరావు గారు | విద్యా | ౧౯౧౯ | ఉన్నది | ౧ | ౦ | ౦ | ఘంటశాల (కృష్ణా |
| ప్రథమపాఠశాలపత్రిక | మాస | వల్లూరి నరసింహరాయుడు గారు | విద్యా | ౧౯౦౬ | లేదు? | ౧ | ౦ | ౦ | రాజమహేంద్రవ |
| ప్రసన్నమంజరి | మాస | యస్. నారాయణమూర్తి గారు | మత | ౧౯౧౧ | లేదు? | ౨ | ౮ | ౦ | విశాఖపట్నము |
| ప్రబంధకల్పవల్లరి | పక్ష | గుంటుపల్లి సోమయ్య గారు | వైజ్ఞా | ౧౯౦౯ | లేదు? | ౨ | ౦ | ౦ | చెన్నపల్లి అగ్రహా |
| ప్రబంధకల్పవల్లి | మాస | గురుజాడ శ్రీరామమూర్తి గారు | సార | ? | లేదు? | | ? | | కాకినాడ |

౨౩. వారపత్రికగ పనిచేయుచు సంపాదకులతో గతించెను.

౨౪. నీలిమందును తయారుచేయుట, తద్వ్యాపార విషయము ప్రచుర మొనరించెను.

౨౫. ఇదియే దేశబంధుగ మారెనని తెలియుచున్నది.

పత్రికలలోని సారము పద్యరూపమున ప్రచురించుచుండెడిది.

...లలో సుచిత్రముగ బంచిపెట్టబడెను. మొదట వ్రాతప్రతిగ వెల్వడి తర్వాత ముద్రితమాయెను.

| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥రందా: రూ | అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ౮౦ మాస | వడ్డెపాటి నిరంజనశాస్త్రి గారు | సాంఘి | ౧౯౦౭ | ఉన్నది | ౨ | ౧ | ౧ | దుగ్గిరాల |
| ్రథ | మాస | ? | వైజ్ఞా | ౧౮౯౩ | లేదు? | | ? | | కడప |
| | వార | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు | ? | ౧౯౨౨ | ౧౯౨౪ | ౧ | ౦ | ౦ | రాజమహేంద్రవరం |
| | మా | యల్. వి. రామచంద్రయ్యర్ గారు | సార | ౧౯౦౯ | లేదు? | ౧ | ౮ | ౦ | మదరాసు |
| విద్య | మాస | గాడిచర్ల సూర్యనారాయణ గారు | విద్యా | ౧౯౨౩ | లేదు? | ౧ | ౦ | ౦ | కాకినాడ |
| విద్య | మాస | పి. హెచ్. నారాయణమూర్తి గారు | విద్యా | ౧౯౧౩ | ఉన్నది | ౧ | ౮ | ౦ | ఏలూరు |
| ద్య | ౮౧ మాస | గరిమెళ్ళ సోమన్న గారు | విద్యా | ౧౯౧౬ | లేదు? | ౨ | ౦ | ౧ | ఏలూరు |
| ము | మాస | శ్రీ సుదర్శనముగారు | సాంఘి | ౧౯౨౭ | లేదు? | ౨ | ౦ | ౧ | చీరాల |
| | మాస | ? | వైజ్ఞా | ? | లేదు? | ౧ | ౮ | ౦ | బందరు |
| | మాస | క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ | మత | ౧౯౧౬ | ఉన్నది | ౦ | ౧ | ౧ | చెన్నపురి |
| తి | మాస | అనంతగిరి శేరనార్యకవిగారు | సార | ౧౯౨౨ | లేదు? | ౨ | ౦ | ౦ | అనంతపురము |
| తి | ౮౨ మాస | జి. సుబ్రహ్మణ్యం గారు | సార | ౧౯౨౬ | ౧౯౨౭ | ౧ | ౪ | ౦ | చెన్నపురి |
| తి | మాస | దువ్వూరి జగన్నాథ శర్మగారు | సంగీ | ౧౯౧౮ | లేదు? | ౩ | ౦ | ౦ | కాకినాడ |
| | మాస | నందిరాజు చలపతిరావు గారు | విద్యా | ౧౯౨౪ | లేదు? | ౨ | ౦ | ౦ | ఏలూరు |
| ృతి | మాస | యస్. కృష్ణారావు గారు | సార | ౧౮౯౯ | లేదు? | | ? | | చెన్నపురి |
| ృతి | మాస | కొల్లిపర పాపయ్య శ్రేష్ఠిగారు | సార | ౧౯౦౫ | లేదు? | | ? | | పిప్పర, కృష్ణా |
| | మాస | యన్. బాపిరాజుగారు | వైజ్ఞా | ౧౮౯౭ | లేదు? | ౧ | ౮ | ౦ | శ్రీకాకుళం (గంజాం) |
| యు | మాస | నాదెళ్ళ పురుషోత్తముగారు | వైజ్ఞా | ౧౮౯౯ | లేదు? | | ? | | బందరు |
| ాయిని | మాస | నందగిరి వేంకటప్పారావుగారు | వైజ్ఞా | ౧౮౯౪ | లేదు? | | ? | | గుడివాడ కృష్ణా |
| దిని | మాస | కేశవశాస్త్రులు డి. రాజశేఖరశాస్త్రి గారు | వైజ్ఞా | ౧౯౨౭ | లేదు? | ౩ | ౧ | ౦ | ప్రొద్దుటూరు |
| రతి | మాస | సోమరాజు రామానుజరావుగారు | సార | ౧౯౧౬ | లేదు? | ౩ | ౧ | ౦ | రంగూన్ |
| ్య | మాస | జి. శ్రీనివాస శాస్త్రిగారు | వేదా | ౧౮౯౫ | లేదు? | ౪ | ౦ | ౦ | చెన్నపురి |
| ం పత్రిక | మాస | శిరోభూషణం వేంకట రంగాచార్యులు గారు | సాంఘి | ౧౯౧౬ | ఉన్నది | ౩ | ౦ | ౦ | సైదాపేట ([illegible]ంబళం) |
| ర్మప్రకాశిక | మాస | పాలావఝల లక్ష్మినారాయణగారు | మత | ౧౯౦౯ | లేదు? | ౩ | ౦ | ౦ | రాజమహేంద్రవరము |
| వనీ | మాస | శాలిలికోలను సుబ్బారావుగారు | వేదా | ౧౯౦౯ | ఉన్నది | ౨ | ౦ | ౦ | ఒంటిమిట్ట, కడప |
| పత్రిక | మాస | ? | వేదా | ౧౯౨౭ | లేదు? | ౨ | ౧ | ౦ | కేలమంగళం (సేలం జి) |
| ైద్య | మాస | బి. సీతారామ రాజుగారు | సాంఘి | ౧౯౨౮ | లేదు? | ౩ | ౧ | ౦ | పులపల్లి (గోదావరి) |
| | వార | బి. నానయ్య | రాజ | ౧౯౧౩ | లేదు? | ౧ | ౮ | ౦ | నెల్లూరు |
| ానిధి | మాస | సి. నరసింహ శాస్త్రిగారు | సార | ౧౯౨౭ | ఉన్నది | ౧ | ౮ | ౦ | ప్రొద్దుటూరు |
| ారిజాతము | మాస | పెద్దింటి వేంకట శాస్త్రిగారు | సార | ౧౯౨౫ | వెంటనే | | ? | | కాకినాడ |
| హిళ | మాస | యు. సుందరమ్మగారు | సాంఘి | ౧౯౨౫ | లేదు? | | ? | | అనంతపురము |
| ను | మాస | ఆదిపూడి సోమనాథ రావుగారు | మత | ౧౯౧౭ | లేదు? | ౧ | ౦ | ౦ | చెన్నపురి |
| త | మాస | బి. వి. నాథ్ గారు | వార్త | ౧౯౧౬ | లేదు? | ౨ | ౦ | ౦ | విజయనగరం |
| త | వార | ఓరుగంటి సోమయాజులు గారు | రాజ | ౧౯౦౮ | లేదు? | ౨ | ౦ | ౦ | విజయనగరం |
| | మాస | దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు | సార | ౧౯౨౪ | ఉన్నది | ౬ | ౦ | ౧ | చెన్నపురి |
| | మాస | వే. మృత్యుంజయ శర్మగారు | సార | ౧౯౧౦ | లేదు? | | ? | | పిఠాపురము |
| | ౮౩ మాస | సుంకర రంగయ్యాగారు | సార | ౧౯౦౪ | లేదు? | | ? | | రాజమహేంద్రవరము |

ాలదినము లీనదుమ నాగిపోయి మఱల తెనాలినుండి ప్రచురింపఁబడుచున్నది.

ీప త్రికయే రెండుమూడు రకములుగ [illegible]

| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ చందా రూ | అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| భువనేశ్వరి | మాస | వి. వీరభద్రయ్యగారు | సార | ౧౯౧౪ | లేదు? | ౧ | ౮ | ౦ | ఉప్పాడ (గోదా |
| మంజువాణి | మాస | మంత్రిప్రెగడ భుజంగరావుగారు | సార | ? | లేదు? | ౩ | ౦ | ౦ | ఏలూరు |
| మందారమంజరి | మాస | ఓగిరాల జగన్నాథరావు గారు | సార | ౧౯౭ | లేదు? | | ? | | కాకినాడ |
| మదరాసు బులెటిన్ ఆఫ్ కో-ఆపరేషను ౮౪ | మాస | ఆర్. రామచంద్రయ్యర్ గారు | ఆర్థి | ౧౯౦౯ | లేదు? | ౧ | ౮ | ౦ | మదరాసు |
| మదరాస విలేజి పంచాయతీబులెటిన్ ౮౫ | మాస | గ్రామపంచాయతుల రిజిస్ట్రారు జనరలు | రాజ | ౧౯౨౭ | ఉన్నది | ౩ | ౦ | ౦ | సెంట్ జార్జి కోట |
| మధురభారతి | మాస | గోపాటి శేషాచార్యులుగారు | సార | ౧౯౨౫ | లేదు? | ౩ | ౦ | ౦ | తెనాలి |
| మనోరంజని | మాస | భాగానగరం గురులింగదేవర గారు | సంస్కృ | ౧౯౦౦ | లేదు? | ౪ | ౦ | ౦ | తుని |
| మనోరంజని | మాస | సత్తిరాజు లక్ష్మీనారాయణ రావుగారు | వైజ్ఞా | ? | లేదు? | | ? | | కాకినాడ |
| మనోరంజని | మాస | కాళ్ళకూరి నారాయణరావుగారు | సార | ౧౯౧౦ | లేదు? | ౨ | ౦ | ౦ | కాకినాడ |
| మనోరంజని | మాస | జి. జగన్నాథ రావుగారు | సార | ౧౯౧౦ | లేదు? | ౨ | ౦ | ౦ | మదరాసు |
| మనోరమ | మాస | చిలకమర్తి లక్ష్మీనరసింహారావుగారు | సార | ౧౯౦౬ | లేదు? | ౩ | ౦ | ౦ | రాజమహేంద్రవ |
| మహారాణి ౮౬ | మాస | వి. కృష్ణమాచారియార్ గారు | సార | ౧౮౮౯ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| మాతృభాష ౮౭ | మాస | కాశీ కృష్ణాచార్యులుగారు | సార | ౧౯౨౧ | లేదు? | ౪ | ౦ | ౦ | గుంటూరు |
| మాతృసేవ ౮౮ | వార | గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు | రాజ | ౧౯౨౩ | ౨౭ | ౩ | ౦ | ౦ | నంద్యాల |
| మానససేవ ౮౯ | మాస | కందుల శ్రీమన్నారాయణమూర్తి నాళము కృష్ణారావుగార్లు | సార | ౧౯౧౨ | లేదు? | ౪ | ౦ | ౦ | రాజమహేంద్రవ |
| మాణిక్యప్రభుపత్రిక | మాస | ? | వేదా | ? | లేదు? | ౧ | ౦ | ౦ | ఆలూరు (నైజాం |
| మీమాంస | మాస | కే. యస్. కామేశ్వరరావుగారు | వేదా | [illegible] | లేదు? | ౩ | ౦ | ౦ | తెనాలి |
| ముద్దు | ద్వైమాస | ఐ. వేంకటరమణయ్య | హాస్య | [illegible] | లేదు? | ౦ | ౧౨ | ౦ | పెదరావూరు తె |
| ముద్దుమాట | పక్ష | యం. వి. సుబ్బారావుగారు | హాస్య | ? | లేదు? | | ? | | పెద్దాపురం |
| ముముక్షురంజని | మాస | ఏ. నరసింహాచార్యులుగారు | వేదా | ౧౯[illegible]౮ | లేదు? | ౨ | ౦ | ౦ | మదరాసు |
| మురళి | మాస | రాయవరపు కొండలరావుగారు | వేదా | ౧౯౨౬ | ఉన్నది | ౧ | ౮ | ౦ | శ్రీకాకుళం |
| ములగవర్తమా[illegible] | మాస | యం. పి. లూక్ గారు | మత | ౧౯౨౦ | లేదు? | ౧ | ౬ | ౦ | కమ్మంమెట్టు (నై |
| మోహిని | మాస | ? | ? | ౧౯౧౭ | లేదు? | | ? | | అనపర్తి |
| యథార్థభారతి | మాస | మళయాళ స్వాములవారు | వేదా | ౧౯౨౮ | ఉన్నది | ౨ | ౮ | ౦ | కొండయ్యర్ వీథి |
| యాదవపత్రిక ౯౦ | పక్ష | ? | సాంఘి | ? | లేదు? | | ? | | తెనాలి |
| యాజ్ఞవల్క్య | మాస | భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి కొండా సుబ్బారాయుడు గార్లు | సాంఘి | ౧౯౨౩ | లేదు? | ౩ | ౦ | ౦ | తెనాలి |
| యుద్ధధ్వని | మాస | సుఖసింగ్ గారు | వార్త | ౧౯౨౧ | ఉన్నది | ౦ | ౧౨ | ౦ | చెన్నపురి |
| యుగంధర ౯౧ | వార | యన్. తిరునారాయణ స్వామిగారు | రాజ | ౧౯౨౭ | లేదు? | ౩ | ౦ | ౦ | ఏలూరు |
| రంగూన్ ఆంధ్రపత్రిక | వార | కే. యస్. సుందరంగారు | రాజ | ౧౯౨౭ | ఉన్నది | ౩ | ౦ | ౦ | రంగూన్ |
| రత్నగిరి ౯౨ | మాస | కస్నెల్లి మునిరెడ్డిగారు | సాంఘి | ౧౯౨౭ | ౧౯౨౯ | ౨ | ౦ | ౦ | హోసూరు (సేలం |

౮౪. ఇదియే బహుశః 'సహకారము' బెజవాడలో నున్నదని యనుమానము.

౮౫. గ్రామపంచాయతీల చట్టము ననుసరించి అధికార పత్రికగ తమప్రకటనలను ప్రభుత్వమువారు ప్రచురించుచున్నారు.

౮౬. మొదటి ఆంధ్రసచిత్ర మాసపత్రిక.

౮౭. సంస్కృత భాషాప్రచారమొనర్చుటకు చిన్న చిన్న పాఠములుగ తెలుగులిపిలో ప్రచురితము.

౮౮. మొదట తాడిపత్రిలో స్థాపింపబడి సంపాదకుల మకాముతో బాటు నంద్యాలకు పత్రికను మార్చిరి. అచట త్వర

౮౯. సచిత్రము.

| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ చందా రూ | అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వార్తాదర్శిని | ౯౯ వార | నేలటూరి కృష్ణమాచార్యులుగారు | వార్త | ౧౮౯౩ | లేదు? | ౩ | ౮ | ౦ | నెల్లూరు |
| వార్తావళి | వార | కొమ్మూరి వేంకట్రామయ్యగారు | వార్త | ౧౯౨౯ | త్వరలో | ౨ | ౦ | ౦ | తెనాలి |
| వాసవి | మాస | తుంపూడి భగవంతం గుప్తగారు | సాంఘి | ౧౯౨౭ | ఉన్నది | ౨ | ౦ | ౦ | కీల్పాక్ చెన్నపు |
| వైఖానస్ | మాస | వి. శ్రీనివాసాచార్యులు గారు | సాంఘి | ౧౯౨౭ | వెంటనే | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| విజయనగరంమహారాజా కళాశాలాపత్రిక | త్రైమాస | మహారాజా కళాశాలా విద్యార్థులు | విద్యా | ౧౯౨౫ | ఉన్నది | ౨ | ౦ | ౦ | విజయనగరం |
| విజయవాడ | వార | ధన్వాడ రామచంద్రరావుగారు | వార్త | ౧౯౨౫ | లేదు? | ౧ | ౮ | ౦ | బెజవాడ |
| విజ్ఞానవల్లరి | పక్ష | దంతనాల నాగేశ్వర శాస్త్రిగారు | సాంఘి | ౧౯౨౭ | లేదు? | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| విజ్ఞానవర్ధని | ౧౦౦ పక్ష | ఎల్లమరాజు నారాయణమూర్తిగారు | వైజ్ఞా | ౧౮౯౫ | లేదు? | ౨ | ౧ | ౦ | రాయదుర్గము (బ |
| విజ్ఞానవర్ధని | మాస | వై. నారాయణప్పగారు | వైజ్ఞా | ౧౮౯౧ | లేదు? | ౬ | ౦ | ౦ | మదరాసు |
| విజ్ఞానవల్లిక | మాస | హెచ్. శంకరరావుగారు | సార | ౧౯౧౫ | లేదు? | ౧ | ౮ | ౦ | ధర్మవరము |
| విద్యాకల్పము | మాస | యం. ఆదికేశవులుగారు | విద్యా | ౧౯౧౭ | లేదు? | ౧ | ౦ | ౦ | మదరాసు |
| విద్యానంద | మాస | స్వామివేంకటేశ్వర్లుగారు | వైజ్ఞా | ౧౯౨౮ | ఉన్నది | ౨ | ౦ | ౦ | పురశెవాకం చెన్న |
| విద్యానిధి | మాస | యన్. అప్పయ్య శర్మగారు | సార | ౧౯౧౫ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| విద్యాపత్రిక | మాస | దుల్లా పట్టాభిరామయ్యగారు | విద్యా | ౧౯౨౬ | లేదు? | ౧ | ౮ | ౦ | బందరు |
| విద్యాభివర్ధని | ౧౦౧ మాస | నెమలి సుబ్బారావుగారు | విద్యా | ౧౮౯౯ | లేదు? | | ? | | నెంకటగిరి |
| విద్యార్థి | ౧౦౨ మాస | వావిలాల గోపాలకృష్ణయ్యగారు | సార | ౧౯౨౮ | ౧౯౨౯ | ౧ | ౦ | ౦ | సత్తెనపల్లి |
| విద్యార్థి | పక్ష | కురుగంటి సీతారామయ్యగారు | విద్యా | ౧౯౨౫ | ౧౯౨౬ | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| విద్యార్థికల్పభూజ | మాస | డబ్ల్యు రామచంద్రరావు గారు | విద్యా | ౧౮౮౨ | లేదు? | | ? | | నెల్లూరు |
| విద్యావతి | మాస | ఓమందూరు వైద్యం దొరసామయ్యగారు | విద్యా | [illegible] | లేదు? | ౨ | ౦ | ౦ | చెన్నపురి |
| విద్యావతి | మాస | సి. దొరసామయ్యంగారు | సార | ౧౯౦౨ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| విబుధరంజని | ౧౦౩ వార | దామరాజు రామచంద్ర రావుగారు | రాజ | ౧౮౬౮ | లేదు? | ౨ | ౦ | ౦ | ఏలూరు |
| వివేకవతి | ౧౦౪ మాస | ఎం. ఏ. శ్రీనివాస సతిగారు | విద్యా | ౧౯౧౧ | ఉన్నది | ౨ | ౦ | ౦ | పార్కుటౌను, చెన |
| వివేకవర్ధని | వార | టి. కేశవరావుగారు | సార | ౧౯౧౨ | లేదు? | ౨ | ౦ | ౦ | ఇనగల్లు, (బాపట్ల |
| వివేకవర్ధని | వార | కం. వీరేశలింగం గారు | వార్త | ౧౮౭౪ | లేదు? | | ? | | రాజమహేంద్రవ |
| వివేకోదయము | మాస | బి. వేంకటరావు గారు | వైజ్ఞా | ౧౯౦౬ | లేదు? | ౧ | ౮ | ౦ | కాకినాడ |
| విశ్వకర్మ | (?) | ? | సాంఘి | ? | లేదు? | | ? | | రాజమహేంద్రవ |
| విశ్వస్ఫుట్ | మాస | సుందూరు వీరభద్రుడుగారు | వేదా | ౧౯౦౨ | లేదు? | ౧ | ౦ | ౦ | వెదురుపాక, (గో |
| విశిష్టాద్వైతసిద్ధాంతబోధన | మాస | ఏ. పార్థసారథిగారు | వేదా | ౧౯౨౩ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| విశిష్టాద్వైతప్రకాశిక | మాస | చింజగూరి వీరరాఘవాచార్యులుగారు | వేదా | ౧౯౧౧ | లేదు? | ౩ | ౦ | ౦ | గుంటూరు |
| వీరశైవప్రచారిణి | పక్ష | గురుదేవి సుబ్రహ్మణ్యం దేవరగారు | సాంఘి | ౧౯౨౯ | ఉన్నది | ౧ | ౮ | ౦ | నెల్లూరు |
| వేంకటేశపత్రిక | వార | పి. దొరస్వామయ్యంగార్ | వార్తలు | ? | లేదు? | | ? | | చిత్తూరు |
| వేగుచుక్క | మాస | సి. యి. పార్కర్ గారు | మత | ౧౯౧౮ | లేదు? | ౦ | ౮ | ౦ | చెన్నపురి |
| వేగుచుక్క | వార | దేవరాజు వేంకటకృష్ణ రావుగారు | రాజ | ౧౯౨౩ | లేదు? | ౩ | ౦ | ౦ | బరంపురము |
| వేదాంతచంద్రిక | మాస | సి. రాజగోపాలాచారిగారు | వేదా | ౧౯౧౫ | లేదు? | ౨ | ౮ | ౦ | చిత్తూరు |
| వేదాంతచంద్రిక | మాస | ? | వేదా | ? | లేదు? | | ? | | బళ్లారి |
| వేదాంతదీపిక | మాస | వి. వాసుదేవాచార్యులుగారు | ? | ౧౯౨౭ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |

౯౯. మొదట శ్రీ తూములూరి వేంకట్రామయ్యగారు సంపాదకులుగ నుండిరి.

౧౦౦. మొదట కళ్యాణదుర్గములో ప్రారంభము.

౧౦౧. మొదట అనంతపురంలో ప్రారంభము.

౧౦౨. మొదట త్రైమాసపత్రికగ ప్రచురింపఁబడెను. ఆగిపోయినది. సం॥ చందా ౫ అణాలతో మాసపత్రికగఁ ప్రచురించ

| ప్రతిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ చందా రు | అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| క | మాస | ? | వేదా | ౧౯౧౩ | లేదు? | ౬ | ౦ | ౦ | బళ్లారి |
| జరి | వార | కొమ్మూరి లక్ష్మీనరసింహముగారు | వార్త | ౧౮౯౪ | లేదు? | ౩ | ౮ | ౦ | చెన్నపురి |
| | ౧౦౫ మాస | వనప్పాకం ఆనందాచార్యులుగారు | సార | ౧౮౯౭ | లేదు? | | ? | | చెన్నపురి |
| | మాస | పి. స్వామి బాబుగారు | సాంఘి | ౧౯౨౩ | లేదు? | ౧ | ౪ | ౦ | నరసన్నపేట (గంజాం) |
| | పక్ష | కాశీ అన్నదానసత్రంవారు | సాంఘి | ౧౯౨౯ | ఉన్నది | ౨ | ౦ | ౦ | గుంటూరు |
| | మాస | సుంకు నారాయణస్వామి శ్రేష్ఠిగారు | సాంఘి | ? | లేదు? | | ? | | నెల్లూరు |
| | మాస | ఎ. ఆర్. తత్వనిధిగారు | సాంఘి | ౧౯౨౭ | లేదు? | ౧ | ౪ | ౦ | అస్కా (గంజాం) |
| | మాస | తి. వ. చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులుగారు | సాంఘి | ౧౯౨౦ | ౧౯౨౭ | ౨ | ౦ | ౦ | పెంటపాడు కృష్ణా |
| ము | మాస | కే. జి. బాబురావుగారు | మత | ౧౯౧౦ | లేదు? | ౨ | ౪ | ౦ | అనంతపురము |
| | ౧౦౬ త్రైవార | గట్టుపల్లి శేషాచార్యులు, నేలటూరి పార్థసారథిగార్లు | రాజ | ౧౯౦౬ | ౧౯౨౩ | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| | ౧౦౭ మాస | ఓంకారానంద స్వామిగారు | వేదా | ౧౯౨౩ | ఉన్నది | ౧ | ౦ | ౦ | తోటపల్లికొండలు (గోదావరి) |
| | మాస | ఆచంట సూర్యనారాయణ రాజుగారు | విద్యా | ౧౮౯౫ | లేదు? | ౧ | ౮ | ౦ | అత్తిలి (కృష్ణా) |
| | మాస | ? | సార | ౧౮౯౩ | లేదు? | | ? | | లమంచిలి (విశాఖ) |
| | మాస | ఎడవల్లి కామశాస్త్రిగారు | సార | ౧౮౯౦ | లేదు? | | ? | | బుచ్చిరెడ్డిపాలెం (నెల్లూ) |
| | ౧౦౮ మాస | కవుతా శ్రీరామశాస్త్రిగారు | సార | ౧౯౨౩ | ౧౯౨౫ | ౭ | ౮ | ౦ | బందరు |
| ుఉవు | మాస | ప్యారీ కంపెనీవారు | సార | ? | లేదు? | | ? | | చెన్నపురి |
| క్తావళి | మాస | కందుకూరి శ్రీశైల వీరభద్ర వరప్రసాదరావుగారు | మత | ౧౮౯౫ | లేదు? | | ? | | ఏలూరు |
| | ౧౦౯ పక్ష | ? | సాంఘి | ? | లేదు? | | ? | | సోంపేట |
| | పక్ష | ఆచంట లక్ష్మీపతిగారు | వైద్య | ౧౯౧౫ | ఉన్నది | ౩ | ౦ | ౦ | మౌంట్‌రోడు మదరాసు |
| | మాస | వావిలికొలను సుబ్బారావుగారు | సార | ౧౯౦౦ | లేదు? | | ? | | నెల్లూరు |
| పత్రిక | మాస | ఈగావారిపాలెం శేషాచార్యగారు | సాంఘి | ౧౯౧౮ | ఉన్నది | ౨ | ౮ | ౦ | ఈగావారిపాలెం (చెంగల్పట్టుజి) |
| ంకటేశ్వర పత్రిక | మాస | పి. అనంతాచార్యులు గారు | మత | ౧౯౧౩ | లేదు? | ౨ | ౦ | ౦ | పుత్తిలపట్టు (?) |
| ిక | మాస | చాగంటి వీరమల్లికార్జున లింగం అయ్యవార్లం గారు | మత | ౧౯౨౭ | వెంటనే | ౧ | ౮ | ౦ | శ్రీశైలము (కర్నూలు) |
| జీవని | పక్ష | శ్రీవీరభద్రపాకయాజిగారు | మత | ౧౯౧౭ | ౧౯౨౮ | ౩ | ౦ | ౧ | బెజవాడ |
| | వార ? | పాల వెంకన్నగారు | సాంఘి | ౧౯౦౯ | ఉన్నది | ౪ | ౦ | ౦ | అమలాపురము |
| కాశిక | మాస | ? | మత | ? | లేదు? | ౧ | ౦ | ౦ | బెజవాడ |
| శి | పక్ష | ముదిగుండ వీరేశలింగ అయ్యవార్లంగారు | మత | ౧౯౨౨ | ఉన్నది | ౨ | ౦ | ౦ | ఒరంగల్ (నైజాం) |
| ాశిక | ౧౧౦ మాస | దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు | మత | ౧౯౧౬ | ౧౯౨౧ | ౧ | ౮ | ౦ | చెన్నపురి |
| ోధిని | ౧౧౧ మాస | ముదిగొండ నాగలింగశాస్త్రిలు గారు | మత | ౧౯౨౬ | ఉన్నది | ౨ | ౦ | ౦ | తెనాలి |
| | (?) | ? | మత | ? | లేదు? | | ? | | భాగ్యనరము |

ధులలో అఖిలభారత జాతీయ మహాసభ (కాంగ్రెస్)అధ్యక్షపీఠము నలంకరించినది వీరొక్కరే!

కొన్నిదినములు త్రైవార, ద్వైవార, దినపత్రికలుగ బ్రచురింప బడియుండెను వారపత్రిక గతించినది.

పురము వద్దనున్న తోటపల్లి కొండలలోనున్న శాంత్యాశ్రమము తరఫున ఆంధ్రాంగ్ల భాషలలో ప్రత్యేకముగ ప్రచురింపఁబడు
ది.

ములకు చిఅపరిచిత్రమైనదే! సచిత్రము. దాదాపు నేటి భారతిని బోలియుండెడిది. తర్వాత దీనికి శ్రీ నడింపల్లి వేంకటలక్ష్మీనర
రావుగారును, శీలం జగన్నాధరావు నాయుడుగారును సంయుక్త సంపాదకులుగ నుండిరి.

| పత్త్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సంఖ్య | చందా అ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| సంగీతపత్త్రిక | మాస | దువ్వూరి జగన్నాథశర్మగారు | సంగీ | ౧౯౨౨ | లేదు? | | ? | | అంగ్రంగి |
| సంగీతప్రకాశిక | మాస | కే. వి. శ్రీనివాస అయ్యంగారు | సంగీ | ౧౯౧౫ | లేదు? | ౬ | ౦ | ౦ | చెన్నపురి |
| సంజీవని | మాస | గాడేపల్లి సుబ్బరావుగారు | వైద్య | ౧౯౨౯ | ఉన్నది | ౧ | ౦ | ౦ | బందరు |
| సంయుక్తసంఘవర్తమాని | మాస | యస్. బి. సీమోనుగారు | మత | ౧౯౦౯ | లేదు? | ౧ | ౦ | ౦ | పసుమలే (మధు |
| సకలవిద్యాభివర్ధని | మాస | శి. వి. కృష్ణారావు గారు | విద్యా | ౧౮౭౫ | లేదు? | | ? | | ? |
| సకలవిద్యాభివర్ధని | మాస | గూడూరి వేంకటరావుగారు | సార | ౧౮౭౫ | లేదు? | ౩ | ౦ | ౦ | విశాఖపట్నము |
| సకలార్థదాయిని | మాస | కొణకంచి వెంకటాచలపతిరావుగారు | విద్యా | ౧౮౯౪ | లేదు! | | ? | | తుని |
| సఖి | త్రైమాస | శ్రీ శివశంకర శాస్త్రి గారు | సార | ౧౯౨౭ | ౧౯౨౮ | ౩ | ౦ | ౦ | గుంటూరు |
| సత్య ౧౧౨ | మాస | యం. శేషాచలముగారు | వేదా | ౧౯౨౩ | లేదు? | ౧ | ౮ | ౦ | బంగరు |
| సత్యమాత | మాస | శి. అనంతంగారు (క్రి. లి. సొ.) | మత | ౧౮౮౭ | ఉన్నది | ౦ | ౧ | ౦ | చెన్నపురి |
| సత్యవాదిని | వార | రామాప్రగడ వేంకట్రామయ్య గారు | ? | ౧౯౦౫ | లేదు? | | ? | | రాజమహేంద్ర |
| సత్యసంవర్ధని | మాస | గోటేటి కనకరాజుగారు | సంస్కృ | ? | లేదు? | | ? | | చెన్నపురి |
| సత్యసంవర్ధని | మాస | రాయసం వేంకటశివుడుగారు | సంస్కృ | ౧౮౯౨ | లేదు? | ౩ | ౦ | ౦ | రాజమహేంద్ర |
| సత్యసాధని | మాస | టి. ఎ. స్వామినాథయ్యర్ గారు | మత | ౧౮౯౭ | లేదు? | | ? | | చెన్నపురి |
| సత్యసాధని | వార | శీలం జగన్నాథరావునాయడుగారు | రాజ | ౧౯౨౮ | ఉన్నది | ౩ | ౦ | ౦ | బందరు |
| సత్యాగ్రహి ౧౧౩ | వార | ఆత్మూరి గోవిందాచార్యులుగారు | రాజ | ౧౯౨౪ | ఉన్నది | ౩ | ౦ | ౦ | ఏలూరు |
| సతీహితబోధిని | మాస | కం. వీరేశలింగకవిగారు | వైజ్ఞా | ? | లేదు? | | ? | | రాజమహేంద్ర |
| సదారోగ్యము—దంతక్షేమము | మాస | డా. హెచ్. వెంకట్రావుగారు | వైద్య | ౧౯౨౬ | లేదు! | ౧ | ౮ | ౦ | చెన్నపురి |
| సన్మార్గదర్శిని | (?) | ? | నైతి | ౧౮౯౭ | లేదు? | | ? | | పిఠాపురము |
| సన్మార్గబోధిని | వార | క. జగన్నాథయ్యగారు | నైతి | ౧౮౯౧ | లేదు? | ౩ | ౦ | ౦ | బళ్ళారి |
| సమదర్శిని ౧౧౪ | ద్వైవార | పింజలి సుబ్రహ్మణ్యం శెట్టిగారు | రాజ | ౧౯౨౭ | ఉన్నది | ౫ | ౦ | ౦ | మౌంటురోడ్డు, |
| సర్ త్యాగరాయ | మాస | పొన్నేరి రామకృష్ణయ్యగారు | సాంఘి | ౧౯౨౭ | లేదు? | ౨ | ౦ | ౦ | చెన్నపురి |
| సరస్వతి | వార | ? | సాంఘి | ౧౮౯౦ | లేదు? | | ? | | బళ్ళారి |
| సరస్వతి | వార | రాజా వాసిరెడ్డిదుర్గా సదాశివేశ్వర ప్రసాదబహద్దర్ గారు | సార | ౧౯౨: | లేదు? | ౪ | ౦ | ౦ | ముక్త్యాల (కృష్ణా |
| సరస్వతి | మాస | శ్రీ రాజా కొచ్చర్లకోట వేంకట రామచంద్రకృష్ణారావు గారు | సార | ౧౮౯౬ | లేదు? | ౩. | ౦ | ౦ | కాకినాడ |
| సరస్వతి | మాస | ? | సార | ? | లేద ? | ౩ | ౦ | ౦ | బందరు |
| సరస్వతీ వైద్యపత్త్రిక | మాస | యస్. సుబ్బారాయుడుగారు | వైద్య | ౧౯౨౭ | వెంటనే | ౧ | ౦ | ౦ | ఆలమూరు (గోద |
| సహకార పత్త్రిక ౧౧౫ | మాస | మానేపల్లి రామకృష్ణరావుగారు | ఆర్థి | ౧౯౨౮ | ఉన్నది | ౧ | ౪ | ౦ | నెల్లూరు |
| సహకారము ౧౧౬ | మాస | సూరివేంకట నరసింహశాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్య, గూడూరి రామచంద్రరావుగార్లు | ఆర్థి | ౧౯౧౫ | ఉన్నది | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| సహకారసమ్మేళనపత్త్రిక ౧౧౭ | మాస | నరసింహదేవర సత్యనారాయణగారు | ఆర్థి | ౧౯౨౮ | ఉన్నది | ౩ | ౦ | ౦ | ఆలమూరు |
| సహాయ | మాస | యం. దేవదాసుగారు | మత | ౧౯౧౦ | లేదు? | ౧ | ౦ | ౦ | రాజమహేంద్ర |
| స్వతంత్ర | వార | గోవిందరాజు వేంకట కృష్ణరావుగారు | రాజ | ౧౯౨౩ | వెంటనే | ౧ | ౮ | ౦ | గుంటూరు |

౧౧౨. స్వవృద్ధివిద్యార్థి సంఘమువారిచేఁ బ్రచురమగుచున్నది.

౧౧౩. పల్లెటూరు ఇందులో లీనమైనది. ఇది పశ్చిమ గోదావరి మండలసంఘమువారి ప్రచురము.

౧౧౪. బ్రాహ్మణేతరపక్షపత్త్రిక.

౧౧౫. నెల్లూరుజిల్లా సహకారసమ్మేళనము తరఫున ప్రచురితము.

౧౧౬. ఇది పూర్వము చెన్నపురిలో మదరాసు కో-ఆపరేటివుబులిటెన్ పేర బ్రచురితమైనది. తరువాత ఆంధ్రసహ

| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ చందా రు | ఆ | పై | స్థలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | వార | భమిడిపాటి సత్యనారాయణగారు | రాజ | ౧౯౨౨ | ౧౯౨౪ | ౩ | ౦ | ౦ | రాజమహేంద్రవరము |
| | ౧౧౫ వార | ముంగ సుబ్బారెడ్డిగారు | రాజ | ౧౯౨౬ | ఉన్నది | ౩ | ౦ | ౦ | నెల్లూరు |
| | వార | గోవిందరాజు వేంకట కృష్ణరావుగారు | రాజ | ౧౯౨౬ | ? | ౨ | ౦ | ౦ | గుంటూరు |
| ...కాశిని | మాస | కనుపర్తి మార్కండేయశర్మ, దై. కోటీశ్వరశాస్త్రి గార్లు | సాంఘి | ౧౯౨౩ | ౨౬ | ౨ | ౦ | ౦ | చెన్నపురి |
| ...కాశిని | మాస | కనుపర్తి మార్కండేయ శర్మగారు | సాంఘి | ౧౯౨౭ | ఉన్నది | ౨ | ౦ | ౦ | కిల్పాకు-చెన్నపురి |
| | ౧౯౯ వార | గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు | రాజ | ౧౯౧౨ | వెంటనే | ౨ | ౮ | ౦ | బెజవాడ |
| | ౧౨౦ ద్వైవార | టంగుటూరి ప్రకాశం, మానికొండ సత్యనారాయణశాస్త్రి గార్లు | రాజ | ౧౯౨౬ | ౧౯౨౮ | ౫ | ౦ | ౦ | చెన్నపురి |
| ...త్రిక | వార | దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు | రాజ | ౧౯౨౩ | ౧౯౨౬ | ౮ | ౦ | ౦ | బెజవాడ |
| | మాస | ప్రేమరాజు సత్యనారాయణరావుగారు | వేదా | ౧౯౨౭ | లేదు? | ౨ | ౦ | ౦ | బందరు |
| | వార | కట్టా సీతారామయ్యగారు | రాజ | ౧౯౨౫ | ౧౯౨౮ | ౩ | ౦ | ౦ | విశాఖపట్టణము |
| | వార | పప్పూ రామాచార్యులుగారు | రాజ | ౧౯౨౫ | ఉన్నది | ౮ | ౦ | ౦ | అనంతపురము |
| ...ప్రధాయిని | మాస | తంగిరాల లక్ష్మీనారాయణశాస్త్రిగారు | వేదా | ? | లేదు? | ౧ | ౦ | ౦ | వెల్లటూరు(కృష్ణా) |
| ...ర్వస్వము | మాస | ఏలూరిపాటి రామభద్రనయనులుగారు | సార | ౧౯౨౮ | త్వరలో | ౮ | ౦ | ౦ | తణుకు |
| | మాస | పులవర్తి లక్ష్మీనరసమాంబగారు | వైజ్ఞా | ౧౯౨౫ | ఉన్నది | ౨ | ౦ | ౦ | కాకినాడ |
| | ౧౨౧ మాస | కే. సూరయ్యగారు | సార | ౧౯౨౧ | ౧౯౨౬ | ౩ | ౦ | ౦ | బెజవాడ |
| | మాస | బుర్రా శేషగిరిరావుగారు | సార | ౧౯౨౦ | లేదు? | ౩ | ౦ | ౦ | విజయనగరము |
| ...ప్రకాశినీ | మాస | జి. సోమయాజిశర్మగారు | సార | ౧౯౧౨ | లేదు? | ౨ | ౮ | ౦ | కోటిపల్లి (గోదావరి) |
| ...పరిపాలన | మాస | కొత్తపల్లి సుబ్బారావుగారు | రాజ | ౧౯౨౭ | లేదు? | ౮ | ౧ | ౦ | ఒంగోలు |
| ...స్థలపత్రిక | మాస | తిత్తిని బలరామయ్యగారు | రాజ | ౧౯౨౮ | ఉన్నది | ౬ | ౦ | ౦ | బారువ (గంజాం) |
| | ౧౨౨ మాస | మాలతీ పట్వర్ధన్ పతిగారు | సాంఘి | ౧౯౧౮ | ఉన్నది | ౮ | ౦ | ౦ | ఎగ్మూరు, చెన్నపురి |
| ...కు వర్తమానములు | మాస | ఇ. యస్. మెకాలేకన్యగారు | మత | ౧౯౧౨ | లేదు? | | ? | | గుంటూరు |
| | ౧౨౩ వార | పాటూరి సుబ్బరామయ్యగారు | రాజ | ౧౯౨౩ | ఉన్నది | ౩ | ౦ | ౦ | నెల్లూరు |
| ...బోధిని | మాస | శ్రీ రాపాక కౌస్తుభముగారు | నైతి | ౧౮౯౩ | లేదు? | ఉచితము | | | కాకినాడ |
| | మాస | బి. నారాయణగారు | వైజ్ఞా | ౧౯౦౯ | లేదు? | ౧ | ౮ | ౦ | కొమరిపాలెం (గోదావరి) |
| | ౧౨౮ మాస | బాలకృష్ణారెడ్డిగారు | సార | ౧౯౨౮ | ఉన్నది | ౩ | ౦ | ౦ | హైదరాబాద్ (దక్కన్) |
| | మాస | యస్. గోపాలస్వామిగారు | వేదా | ౧౯౦౯ | లేదు? | ౧ | ౦ | ౦ | కార్వేటినగరం |
| ...జని | మాస | కొమ్మూరి లక్ష్మీనరసింహరావుగారు | సాంఘి | ౧౮౯౯ | లేదు? | | ? | | కాకినాడ |
| ...ని | ? | ? | ? | ? | లేదు? | | ? | | బందరు |
| ...ద్రిక | మాస | సూర్యదేవర సంజీవరాయణంగారు | వేదా | ౧౯౨౫ | ౧౯౨౮ | ౨ | ౮ | ౦ | తుమ్మపూడి (గుంటూరు) |
| | ౧౨౪ మాస | కస్తూరి శివశంకరశాస్త్రిగారు | సార | ౧౯౦౬ | ౧౯౨౭ | ౧ | ౮ | ౦ | నరసాపురము (గోదావరి జి) |
| ...ని | మాస | ? | ? | ౧౮౮౮ | లేదు? | | ? | | కాకినాడ |
| | మాస | నల్లగొండ కోదండరామయ్యగారు | నైతి | ౧౮౯౮ | లేదు? | | ? | | రాజమహేంద్రవరము |
| ...తము | మాస | జి. రామానుజాచార్యులుగారు | సార | ౧౯౨౮ | లేదు? | ౧ | ౦ | ౦ | పొన్నూరు (గుంటూరు) |

...శ్రీ వెలదనూలు సుబ్బారెడ్డిగారు సంపాదించి గతించిరి. ఇపుడు వీరు సంపాదించుచున్నారు.

...హోంరూలు ఉద్యమము ప్రారంభదశలో బయలుదేనవెంటనే నెలలో సంపాదకులును, సహాయ సంపాదకులును కారాగారశిక్షకు పా...కులైరి. అంతతో పత్రిక గతించెను.

...సనసభా ఎన్నికల సందర్భమున వెల్వాడి ప్రయత్నము సఫలమగుడు వెంటనే నిల్పివేయఁబడెను.

...ప్రథమమున తెనాలిలో శ్రీ శివశంకరశాస్త్రిగారి సంపాదకత్వమున ద్వైమాసపత్రికగ సాహితిసమితి పక్షమున ప్రచురింపఁబడెను, ...భారతమహిళాసంఘ పక్షమునఁ ప్రచురింపఁబడుచున్నది. మొదట అడయారులో ప్రచురితము.

[illegible]

| పత్రిక | వ్యవధి | సంపాదకులు | విషయము | మొదలు | తుది | సం॥ రు | నందా అ | నైె | స్థ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| సుభాషి | మాస | పందెరి మల్లికార్జునరావుగారు | సార | ౧౯౨౬ | లేదు? | ౩ | ౧ | ౦ | రాజమహేంద్ర |
| సుబోధిని | మాస | యం. యస్. సుబ్బన్నగారు | మత | ౧౯౨౮ | లేదు? | ౨ | ౪ | ౦ | బళ్లారి |
| సుమనోభిరంజని | మాస | డబీరు కృష్ణమూర్తి గారు | సా | ౧౮౮౮ | లేదు? | | ? | | జలుమూరు, వి |
| సుమనోల్లాసిని | మాస | సుసర్ల కుమారస్వామిశాస్త్రి<br>వేటూరి సుందరశాస్త్రిగార్లు | సార | ౧౯౨౫ | లేదు? | | ? | | పెదకళ్లేపల్లి (క |
| సువర్ణ లేఖ | వార | తల్లాప్రగడ సూర్యనారాయణగారు | సంస్క | ౧౯౧౪ | లేదు? | ౩ | ౦ | ౦ | తణుకు |
| సుశీల | పక్ష | సుంకరి రంగయ్యగారు | నైతి | ? | లేదు? | | ? | | రాజమహేంద్ర |
| సూర్యాలోకము | వార | జి. సి. వి. శ్రీనివాసాచార్యులుగారు | సార | ౧౮౯౫ | లేదు? | | ? | | చెన్నపురి |
| హం[illegible] | మాస | యస్. హనుమంతరావుగారు | వేదా | ౧౯౦౮ | లేదు? | ౨ | ౦ | ౦ | గుత్తి |
| హిందూజనసంస్కారిణి | మాస | మన్నవ బుచ్చయ్యగారు | మత | ౧౮౮౦ | లేదు? | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| హిందూబాంధవి ౧౨౬ | పక్ష | చతుర్వేదుల రాఘవయ్యగారు | రాజ | ౧౯౦౧ | ఉన్నది | ౩ | ౦ | ౦ | పల్లిపాడు, నెల్లూ |
| హిందూముస్లిం పత్రిక | వార | ? | వార్త | ౧౯౨౪ | లేదు? | ౩ | ౦ | ౦ | పాలకొల్లు |
| హిందూయువతి ౧౨౪ | పక్ష | యామినీపూర్ణ తిలకమ్మగారు | సాంఘి | ౧౯౨౩ | ౨౬ | ౩ | ౦ | ౦ | చెన్నపురి |
| హిందూసుందరి ౧౨౮ | మాస | బాలాంత్రపు శేషమ్మగారు | వైజ్ఞా | ౧౯౦౨ | ఉన్నది | ౨ | ౦ | ౦ | కాకినాడ |
| హితకారిణి | వార | కందుకూరి వీరేశలింగకవిగారు | సంస్క | ౧౯౦౫ | లేదు? | | ? | | రాజమహేంద్రవ |
| హితబోధిని | మాస | బి. శ్రీనివాస శర్మగారు | నైతి | ౧౯౧౮ | లేదు? | | ? | | హైదరాబాద్ |
| హితవాది | మాస | రెవ. డి. అనంతంగారు | మత | ౧౯౦౫ | లేదు? | | ? | | బందరు |
| హృదయారావము | మాస | దేవర్ సతి, కే. గోపాలరావుగార్లు. | మత | ౧౯౧౨ | లేదు? | ౦ | ౧౨ | ౦ | చెన్నపురి. |

౧౨౬. ఇది పల్లిపాడు సత్యాగ్రహాశ్రమము తరఫున శ్రీ లోకమాన్యునిస్మారకముగఁ బ్రచురింపఁబడుచున్నది.

౧౨౪. పక్షపత్రికగ ప్రారంభింపఁబడి వారపత్రికగ మార్చఁబడికొలఁదిలో గతించెను.

౧౨౮. కాకినాడ విద్యార్థినీ సమాజమువారి తరఫునఁ నేడు ప్రచురింపఁబడుచున్నది. దీనిని శ్రీ సత్తిరాజు సీతారామయ్య శాంతాబాయమ్మగారు, మాడభూషి చూడమ్మగారును ఒకరి తరువాత నొకరు సంపాదించిరి. ఇపుడు ఉన్నది. మముగా జయప్రదముగ నిర్వహింపఁబడుచున్న పత్రిక ఇదియొకటే!

---

## పై పత్రికలపట్టికను తయారుచేయుట నుద్దేశించి రెండుమాటలు

గీ. వార్తయందు జగము వర్తిల్లుచున్నది
యదియు లేనినాడ యఖిలజనులు
అంధకారమగ్నులగుదురు గావున
వార్తనిర్వహింపవలయుఁ బతికి.

—భారతము.

ఏతద్వ్యాఖ్యానుసారము పూర్వము వార్త నిర్వహింపవలసిన విధి ప్రభువులపైనుండగా నేడు ప్రజలపై నాధారపడియున్నది. నేడు ఏనాటి వార్త యానాటికి దెలియక పోవుట అంధకారమనను న్నట్లుగనే తలంపబడుచున్నది.

ఈ వార్త నిర్వహించు పద్ధతి పూర్వము సమావేశములలోగాని,

ఇపుడు అటులుగాదు. మాసపత్రికలు, ప వారపత్రికలు, దినపత్రికలు వెలువడుచున్నవి. ఇం యము, సాయంత్రము, మధ్యాహ్నము ఎప్పటికప్పుడే పత్రికలు వెలువడుచున్నవి. ఇవి తపాలా, తం లగు సౌకర్యములతో వాయువార్తలు నిర్వహిం దినమునకు ఎన్నియోమారులుగూడ పత్రికలు ప్రచురింప ఇట్టి సౌకర్యముల నన్నిటిని సమకూర్చుటకు ముద్ర తదితర పరికరములు సులభమగుచున్నవి. ఖండాం లెక్కకు మిక్కుటముగ పత్రికలు, వార్తాప్రచారకస దినము వర్ధిల్లుచున్నవి.

మన భరతఖండమున పత్రికాప్రచురణము చాలి

ి లెక్క కు మిక్కిలిగనున్నవి. కాని ప్రజలవద్దనుండి తగు
ంపత్తులు వచ్చుటలేదు. అందుకు రెండుకారణములు గను
(౧) విద్యావిహీనత (౨) దారిద్ర్యము ఇవి సామాన్య
నంతరింపగలవిగ తోచవు. పత్త్రికలును ఈవిద్యావిహీన
కు సమయజేసి విజ్ఞానవంతులజేయ గలవు. అందుకుకారణ
కాని, విధిలేదు. చేయునదేమి? ఏదో విధముగ ప్రయత్న
యే సద్యఃకార్యకరణము.

తెలుగుదేశమునను కొద్దియో గొప్పయో పత్త్రికామూల
 కలిగినదనిగా చెప్పకతీరదు. అందు కాంధ్ర దినపత్త్రిక
ణము. ఈ పత్త్రికమూలమున నెందరో విద్యావంతులైరి.
శపవిత్రాశయమున బనిచేసి తను శక్తికొలది విద్యాదేశ
ల్పించిన పత్త్రికలు, పత్త్రికాధిపతులు మన యాంధ్రదేశ
లేదు. కాని పత్రికలు చిరంజీవులుగ నుండజాలకపోయి
ముఖ్యకారణము వానికి ధనాభావము, జ్ఞానాభావము,
ు మొదలగు కారణములెన్నియో గలవు.

స్థితుల నన్నింటిని గమనించక మిత్రులు కొందరు ౪, ౫
 నాంధ్రములో పత్త్రికలు కలవాయని యందురు.
పరికించిన ఎన్నియో పత్త్రికలు కలవు. పత్రికాపఠనము
జనముల వక్కాణింప నగత్యములేదని నాభావము. ఆంధ్ర
కిని పత్త్రికలు పనిచేయుచున్నవి ఒకవంద యుండగలవు.
తగినప్రోత్సాహము లేదు.

భావములతోపాటు మన ఆంధ్రమునను పత్త్రికాప్రచా
డ నెక్కువ ప్రయత్నింపబడెనని తెల్పుటకును, ఉత్సా
సేవానిరతులును అనేకులు ముందంజ వేసియేయుండిరని
 నేను ఈపట్టికను ప్రకటించుచున్నాను.

పట్టిక వలన ప్రయోజన మేమందురేమో - ఇదివఱకు
రులు పత్త్రికలను ప్రారంభించి విఫలులైరనియు,
 తగు నిర్వహణనైపుణ్యముతో, రచనాసౌష్ఠవము
సుస్థిరతతో, స్వయంపోషకపథకముతో ప్రారంభించిన
ను దేశసేవను జేయుటకు అవకాశ మొసంగగలదనియు,
 పెట్టిన నష్టదాయకమగుననియు, నుదాహరణ పూర్వక
ంచుటయే. ఇక ముందును పత్త్రికాప్రచారము విరివిగా
ననియు, పత్త్రికల నభివృద్ధిపరుపుడనియు ప్రజలకు
చున్నాను.

ఈ పై ఆశయముతో నేను ౧౯౫౯ డిసెంబరు నెలలోగా తెలుగు పత్త్రికల సమగ్రసంక్షిప్తచరిత్రమును సూచీమాత్రముగ 'ప్రాంజలి' యను శీర్షికఁ బ్రచురింపఁదలంచి పత్త్రికలద్వారమున నాంధ్రపత్త్రికాసంపాదకులఁ బ్రార్థించియుంటిని. అందుల కొక రిద్దరు మాత్రము జవాబొసంగిరి. అందువలన నది కానిపనియని తోచెను. కొందఱు సుజనులు, తమవదనున్న పరికరము నొసంగిరి. రిజస్ట్రార్ ఆఫ్ బుక్స్ కార్యాలయములో కొంతపరికరము లభింపగలదని తలంచితిని. అచటికి వెళ్ళితిని. అచట ౧౮౬౭ నుండి పుస్తకరూపమున బ్రచురింపఁబడిన పత్త్రికల పట్టికలు లభ్యమాయెను. కొంతసామగ్రి మాత్రము లభించెను. డిక్లరేషను ప్రతులు దొఱకునని యూహించితిని. అని రహస్యముగ నుంచఁబడునని తెల్పిరి. అవి దొఱకిన పరిపూర్ణమగు పట్టిక లభించెడిదే! ఎటులైన నొకపట్టికను దయారుచేయఁదలంచి ఈ పట్టికను తయారుచేసితిని.

ఇందుదాహృతములైన తేదీలు కాని, వ్యవధులు కాని, తదితర వివరములుగాని దొఱకినంతవఱకు ఆధారసహితములే! కాని, ఇవే సరియైనవనజాలను. కొన్ని జ్ఞప్తిని బట్టికూడా యుదాహరించితిని.

ఈ పట్టికను తయారుచేయుటకు మిక్కిలి తోడ్పడిన శ్రీ కొడాలి శివరామకృష్ణరావు (ఆంధ్రపత్రికా సహాయ సంపాదకులు), శ్రీ నాథం విశ్వనాథయ్య, గారికిని, తదితర మిత్రులకును కృతజ్ఞతావందనములు. అంతియగాక కొన్ని గ్రంథాలయ గ్రంథాలును, పత్త్రికలలోని వ్యాసములును సహాయకారులైనవి. తద్రచయితల కేనెంతయు గృతజ్ఞుడను.

## సంకేతముల వివరములు

దిన-దినపత్త్రిక, త్రైవార-వారమునకు మూడుమార్లు వెలువడు పత్త్రిక, ద్వైవార-వారమునకు రెండుమార్లు వెలువడు పత్త్రిక, వార-వారపత్త్రిక, పక్ష-పక్షపత్త్రిక, మాస-మాసపత్రిక, ద్వైమాస-రెండు నెలలకొకసారి ప్రకటింపఁబడు పత్రిక, త్రైమాస-మూడునెలల కొకపర్యాయము ప్రకటింపబడుపత్రిక. ??-ఉన్నదీలేనిది తెలియదు. వగైరా.

సార-సారస్వతము, సాంఘి-సాంఘికము, మత-మతవిషయికము, వైజ్ఞా-విజ్ఞానసంబంధమగునది. వైద్య-వైద్యవిషయికము, రాజ-రాజకీయము, సంగీ-సంగీతము, సంస్కా-సంస్కారవిషయికము, జంతు-జంతుశాస్త్రము, జ్యోతి-జ్యోతిషశాస్త్రము, న్యాయ-న్యాయశాస్త్రము, నైతి-నైతికము, పారి-పారిశ్రామికము, ఆర్థి-ఆర్థిక విషయము, వ్యాపా-వ్యాపారము హాస్య-హాస్యము. వగైరా.

## చిత్రములు



---


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు—శ్రీ పండిత జవహర్‌లాలు నెహ్రూగారు; మురళీవాలా;

సాధారణ చిత్రములు—౪౪-వ భారత జాతీయ మహాసభా చిత్రములు ౧౪; ఇండియన్ పిక్టోరియల్ ఎడ్యుకేషన్‌లోని చిత్రములు ౫; హాతీసింగ్ సమాధి; వాలుచూపులు; భావోన్మాదము; వ్యంగ్య చిత్రములు ౨; ఆకస్మిక ఛాయాచిత్రములు ౧౦; ఇతర చిత్రములును.

---

# చిత్రములు

# చిత్రములు





---




శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు

అధ్యక్షుడు

నలుబదినాలుగవ అఖిలభారత జాతీయమహాసభ, లాహోరు

# సప్తవర్షీయ భారతి

వేలాల సుబ్బారావు గారు

ఐతిహాసికమదేభాళికి పుష్కరం
బిందీవరాక్షుల కిందురోచి
చిత్రకారాంబుజ శ్రీకి ప్రత్యూషంబు
కథకామరాళికి కల్పశాఖి
కవికేకిపటలి కుత్కటమేఘలాభంబు
నటభృంగముల కబ్జపుటరసంబు
లలితగాయక పికంబులకు వసంతంబు
యతిహంసములకు వేదాంతదుగ్ధ
మాయతాంధ్రవసుంధరాస్తూయమాన
జనపదప్రాంత నగర సంచయములందు
సకలవిధ జనావళీ స్థగితసప్త
హాయనోజ్జ్వల భారతీ, స్వాగమంబు.

---





చెన్నపట్టణము, జనవరి ౧౯౩౦

సంపుటము ౭   శుక్ల సంవత్సరము పుష్యమాసము   సంఖ్య ౧

భారతికి ఆరేండ్లు నిండినవి. ఏడవయేడారంభమైనది. క్రొత్త సంవత్సరమారంభమగునపుడు పంచాఙ్గశ్రవణమును జేసి గతాగత ఫలములను నిర్ణయించుకొనుట పురోవృద్ధికి సాధనము. భారతజాతీయ జీవనమునకంగమైన ఆంధ్రజాతీయజీవనమునందు భారతజాతీయ జీవనమునందు వలెనే గతించిన యాఱేండ్ల చరిత్రయును మహాఘట్టముగనున్నది. ఆంధ్రజాతీయ హృదయమునందు నూతనవికాస ముదయించినది. స్త్రీలు పురుషులు, పండితులు పామరులు, బ్రాహ్మణులు పంచములు, బాలురు బాలికలు, వృద్ధులుయువకులు దేశకల్యాణమునకును, మానవకల్యాణమునకును కానుకలను సమర్పించుచున్నారు. కవులు కావ్యములను, శిల్పులు శిల్పములను, గాయకులు గానమును, చిత్రకారులు చిత్రములను, పండితులు విమర్శనలను ఉత్పత్తి చేయుచున్నారు. పామరులు జయఘోషలను ప్రకటించుచున్నారు. జాతీయహృదయమునందు ప్రబలుచున్న నూతనవికాసము ప్రజాప్రవృత్తియందు సర్వాంగములందును ఉదయమగుచున్నది. సాహిత్యకళాస్వరూపిణియైన భారతియును ప్రజాప్రవృత్తియందుదయించిన నూతన వికాసమును ప్రత్యక్షము చేయుచున్నది.

వర్తమానయుగము మహోదయ యుగమైనను మహాపరివర్తనయుగము. ప్రపంచమునం దంతటను ప్రాచీనసంస్థలు పరివర్తనమును బొందుచు నవయుగనిర్మాణమునకు సాధనంబులగుచున్నవి. రాజ్యాంగములు మారుచున్నవి. సాంఘిక వ్యవస్థలు నూతనాకృతిని దాల్చుచున్నవి. మతప్రవృత్తి విశ్వస్వరూపమును

పొందుచున్నది. నైతికనిర్ధారణములు విశాలరూపమును వహించుచున్నవి. ఆర్థిక నిర్ణయములు ప్రజాక్షేమ పరాయణము లగుచున్నవి. సకలసంస్థలును నవీనస్వరూప స్వభావములను పడయుచున్న సమయమునందు పరివర్తనమునకు మూలాధారమైన ధర్మస్వరూప స్వభావములును నూతనార్థమును ప్రకటించుచున్నవి. సనాతనమైన భారతీయసంస్కారము నవయుగపరిణామమును సహజముగ బడయుచున్నది. నవయుగపరిణామమునకై ప్రాచ్య పాశ్చాత్య సంస్కారములకును, ఆధ్యాత్మికాధిభౌతిక సంస్కారములకును, సాంఖ్యకర్మయోగములకును, ప్రాచీననవీనసంప్రదాయాచారములకును సంరంభసాహచర్యములు గలుగుచు, నవయుగనిర్మాణము సహజముగ గలుగుచున్నది. విశ్వవ్యాప్తములైన సాహిత్యములు, కళలు నవయుగనిర్మాణమునకు వినియోగపడగలవిధమును ప్రతిభావంతుల రచనలు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముని సహాయనిరాకరణోద్యమము,రవీంద్రనాథఠాకూరుగారి కావ్యములు, జగదీశచంద్రబోసుగారి శాస్త్రపరిశోధనలు, రాధాకృష్ణయ్యగారి వేదాంత సిద్ధాంతములు మొదలగునవి నవయుగపరిణామ విధానమును విశదముచేయుచున్నవి. కవులు, శిల్పులు, కర్మకారులు, శాస్త్రజ్ఞులు, పరిశోధకులు, రాజనీతిజ్ఞులు, సాంఘికవాదులు, ఆర్థికపండితులు నూతనయుగధర్మమును సంకీర్తనము చేయవలసిన యవసరము గలిగినది. ప్రతిభావంతులు అనుకరణమును మాని నిర్మాణమునకు బూనుకొనవలసిన యవసరమును నవయుగధర్మము విశదముచేయుచున్నది. కవులు, చిత్రకారులు, పరిశోధకులు, విమర్శకులు,పండితులు పాడిన పాటనే పాడుటయును, నవీన పరిస్థితులను విస్మరించుటయును సదాచారముగ నున్నది. వాఙ్మయము, శిల్పము, లలితకళలు, కర్మకళలు నవయుగ నిర్మాణము నభిలషించుచున్నను పూర్వానుకరణము ప్రముఖముగ నున్నది. సర్వతోముఖమైన భారతీయ విజ్ఞానము స్తంభించినది. సాహిత్యము, కావ్యములు, కళలు దేశావసరములకును, ప్రజావికాసమునకును నిరుపయోగము లగుచున్నవి. వర్తమానవిషాదస్థితియందు జాతీయ ప్రత్యభిజ్ఞానమును గలుగజేయుటకు గుణయుతమైన అనుకరణముకన్నను దోషయుతమైన నిర్మాణము ప్రయోజనకర మగుచున్నది. ప్రాణములేని యనుకరణము సుందరమైనను మానవకల్యాణమునకు నిరుపయోగ మగుచున్నది. భారతియందు గతించిన ఆరేండ్లయందును ప్రచురింపబడిన వివిధవ్యాసములు, చిత్రపటములు, నీవిషయమును పరిస్ఫుటము చేయుచున్నవి. ప్రతిభావంతులు నూతన రచనలను జేయుచున్నను సామాన్యముగ రచయితలు ప్రాత వాసనలనే యారాధించుచున్నారు. రచనల కాధారము ప్రాచ్యసంస్కార మయినను, పాశ్చాత్యసంస్కార మయినను సత్యాశ్రయమును, ధర్మాశ్రయమును లేక, స్వార్థమానాశ్రయపూరితమై పురుషార్థమునకు నిరుపయోగ మగుచున్నది. భారతి నారేండ్లనుండియు సకలవిధముల పోషించి పెంచిన యాంధ్ర మహాజనులకు కృతజ్ఞతాంజలులను సమర్పించుచు, భావికాలమునందును భారతి సర్వతోశోభితమై విశ్వకల్యాణమునకు మంగళహారతులను సమర్పించునటు లనుగ్రహించి ఆదరింప వేడుచున్నాము.


AMRUTANJAN
SOVEREIGN-REMEDY
AMRUTANJAN

29

ఘనతగన్న యనేక కవికుమారక పికానీకమ్మునకు మావిమూఁకవమ్మ!
చిత్రచిత్రితనూత్న చిత్రకథారత్న రాజికిఁ రత్నాకరమ్మునమ్మ!
నవరసాలంకార కవితా మహాకావ్య కలహంసలకుఁ దటాకమ్మవమ్మ!
నాట్యసంగీతాది నానాకళా మయూరములకుఁ మేచకాభ్రమ్మవమ్మ!
భారతీ! తావకీనావతారకలన-ద్రవిడ భాషాంగనామణుల్ తలలు వంప
నాంధ్రభాషాపురంధ్రి నీరంధ్ర కీర్తి-నవనవోత్తేజ మొందుచున్నది కదమ్మ!

ఆచరించుచునుందు పతిభక్తి సంయుక్తి బహుళేష్ట దైవత ప్రార్థనముల
భూషించుచుందువు పూర్వాధునిక మహాకవిపుంగవుల ప్రసంగంబులెల్ల
ఖండించుచుందు వఖండ పాండిత్యాసిఁ గాకవిదుష్కావ్య కాననముల
వర్ణించుచుందువు వారాశి కాసారభూభృదారామాది వైభవముల
లలిత సత్కావ్యలక్షణ లక్షితవయి-యెన్ని పోకడ లెఱిఁగి తాఁతేండ్లలోనె?
సాటి పత్రికాపుత్రికా కోటి మెచ్చు-భారతీ, నీదు సాహితీప్రౌఢరీతి!

సకలాచేతనచేతనాకలిత విశ్వంబున్ ముఖంబందు నం
దకుమారుం డొకమారె చూపె; నటు నిత్యంబుం బ్రదర్శింతు వీ
వకలంకాధునికాఖిలాంధ్ర కవిలోకాశేషముం గూడఁ ద
త్సుకవిత్వ ప్రతిభాకృతిప్రతతితో శోభారతి! భారతీ!

ఈ డొక యింత లేదుకద యెన్నఁడు నేర్చితి విన్ని విద్దెలా
ఱేఁడుల ముద్దుబిడ్డ వయి; యేడవయేఁడిపు డయ్యె నమ్మ! నూ
ఱేఁడుల యవ్వవైన వట కిట్టులఁ బల్లెలఁ బట్టణాల మా
టాడఁగ రాని కీర్తిఁ గొనియాడఁబడంగదవమ్మ, భారతీ!

కడు లేవయసుపత్రికాపుత్రికాభావ మెంచి ని న్నాశీర్వదించవలెనో
యసమానశాస్త్రవిద్యాధిదేవతగా స్మరించి నీకు నమస్కరించవలెనో
జిలిబిలిముద్దుపల్కుల నొల్కు క్రొందేనె లాని నీమోము ముద్దాడవలెనో
సతతమ్మపారవిజ్ఞాన వారాశిగా నెంచి ని న్నెపుడుఁ బూజించవలెనో
మాకు నీయందుఁగల్గు ప్రేమం బదెల్ల-వత్సలత యౌనో నిర్మలభక్తి యౌనో?
చెప్పి చేయించుకొనవమ్మ చేయఁదగిన-చేతలవి యేవో భారతీ, ప్రీతి మీఱ!

7 1- 1ఎ 3

ఊరూరన్ నుతు లొందుచుందువు తెనుం గున్నట్టి దేశాలలో
నాకూడోన్నతి; నాంధ్రరాష్ట్రమన నేలా, వంగరాష్ట్రంబు, బ
ర్మారాష్ట్రంబును, మధ్యరాష్ట్రము, మహారాష్ట్రంబునుంగూడ నీ
సౌఖ్యం బేరును దీరు వేమరుఁ గడున్ శ్లాఘింపవే భారతీ!

ఆయాయిండ్ల నెలంత లొక్కయెడఁ బోగై వ్యర్థసంభాషలన్
జేయన్ గల్గుచునుండె వైర; మిపు డా స్త్రీకోటికిన్ నిత్యమున్
నీయాసక్తియ! భారతీ భగవతీ, నీపుణ్య మూలంబునన్,
మాయిండ్లన్ జగడంబు లుండవుసుమా మధ్యాహ్న కాలంబులన్.

కలకార్యంబుల వేగఁ దీర్చి శయనాగారంబులం జొచ్చి భ
ర్తలహస్తంబుల నున్న నిన్నడుగఁగాఁ దా మీయ మన్నంత భా
ర్యలు బల్మిం గొనఁ దత్కరద్వయ సముద్యత్కంకణ క్వాణముల్
నెలలో నష్టమరాత్రివేళ వినవే నీ వెప్పుడున్ భారతీ!

పంతం పట్టి నగల్ గొనంగఁ బతులన్ బాధింత్రు; లే విప్పు డా
పంతా, లల్క, లభోజనంబులు, నినున్ వాంఛింత్రు, నిన్గొన్న చో
సంతోషింతురు; నీవ లేనియెడలన్ సామాన్య సంసారులో
కాంతుల్ కాంతల మెప్పు లెట్లు వడయంగా నేర్తురో భారతీ!

మధురశ్రావ్య నవీన కావ్య కవితా మందాకినీ స్నాతవై
పృథువర్ణాంచిత చిత్రచేలవయి, నీవిజ్ఞాన సంపచ్ఛటా
గ్రథితంబౌ కలగూరగంప నొకచంకం దాల్చి మాయింటికిన్
విధిగా మానుతు లందఁగా నెలనెలన్ విచ్చేయుమా భారతీ!

కథలం జెప్పుచు నవ్యభవ్య రసవత్కావ్య ప్రబంధావళీ
సుధవర్షింపుచు సత్కళావిభవముల్ శోధించి వ్రాయుచ్చుచున్
బుధరోలంబచిదంబకాంబుజమవై పొల్పొంది మాయింటికిన్
విధిగా మానుతు లందఁగా నెలనెలన్ విచ్చేయుమా భారతీ!

ఓంకారంబునఁ బద్మబాంధవ సహస్రోద్యత్ప్రభా మూర్తివై
పంకేజాసనసీమవైఁ జెలువుల్ భాసిల్లఁ గొల్వుండి, ని
శ్శంకన్ మా యకలంక కావ్యకవితాసాహిత్య సామ్రాజ్య మే
వంకం జూచిన నీవ వై యనిశమున్ బాలింపుమా భారతీ!

---

# సంస్కృతవర్ణసమామ్నాయము

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు, యమ్. ఏ.

౧. సంస్కృతభాషావర్ణసమామ్నాయ మీ క్రింద జూపబడినది.

| | | హ్రస్వము | దీర్ఘము |
|---|---|---|---|
| అచ్చులు:— సమానాక్షరములు: | | | |
| ,, | కంఠ్యములు: | అ | ఆ |
| ,, | తాలవ్యములు | ఇ | ఈ |
| ,, | ఓష్ఠ్యములు: | ఉ | ఊ |
| ,, | మూర్ధన్యములు: | ఋ | ౠ |
| ,, | దంత్యము. | ఌ | |
| సంధ్యక్షరములు: | కంఠ్యతాలవ్యములు: | ఏ | ఐ |
| ,, | కంఠోష్ఠ్యములు: | ఓ | ఔ |
| అనుస్వారము: | అనునాసికము: | ం | |
| విసర్గ | కంఠ్యము | ః | |

| | | అఘోషము | | ఘోషవంతములు | | |
|---|---|---|---|---|---|---|
| హల్లులు:— స్పర్శలు: | | | | | | |
| ,, | కంఠ్యములు: | క | ఖ | గ | ఘ | ఙ |
| ,, | తాలవ్యములు: | చ | ఛ | జ | ఝ | ఞ |
| ,, | మూర్ధన్యములు: | ట | ఠ | డ | ఢ | ణ |
| ,, | దంత్యములు: | త | థ | ద | ధ | న |
| ,, | ఓష్ఠ్యములు: | ప | ఫ | బ | భ | మ |
| అంతస్థలు: | తాలవ్యము: | | | | | య |
| ,, | మూర్ధన్యము: | | | | | ర |
| ,, | దంత్యము: | | | | | ల |
| ,, | దంతోష్ఠ్యము: | | | | | వ |
| ఊష్మలు: | తాలవ్యము: | | | | | శ |
| ,, | మూర్ధన్యము | | | | | ష |
| ,, | దంత్యము | | | | | స |
| ,, | కంఠ్యము | | | | | హ |

వేదమున ళ యను మరియొక యక్షరము కలదు. ఇది అజ్మధ్యస్థ డకారస్థానమున గనబడుచుండును. ఇది మూర్ధన్యవర్ణము-ఇట్లు ఋగ్వేదమున ఈడే యనుపదము ఈళే యని యుచ్చరింపబడుచుండును కాని ఈడ్యః యను పదమున మాత్ర మట్టిమార్పు పొందుటలేదు. ఈరీతిగా మీఢుషే యను పదము మీళ్హుషే యని యుచ్చరింపబడునుగాని మీఢ్వాన్ అను పదమున మాత్ర మట్టి విపరిణామమును పొందుటలేదు.

పైవర్ణములను పేర్కొనునప్పుడు వానికి కారశబ్దమును చేర్చి పేర్కొనుచుందురు. ఇట్లు అ యను వర్ణమును అకారమనియు, క యనుదానిని కకారమనియు, హ యను దానిని హకారమనియు వ్యవహరించుట యాచారమై యున్నది. ర యను వర్ణముమాత్రము రవర్ణమనుటకు మారుగా రేఫ యనుపేరు వహించుకొనుచున్నది.

౧. అచ్చులకు స్వరములని పేరు. కంఠమునందు పుట్టిన నాదమే వివృతమగు ముఖమార్గముయొక్క యాకార భేదములచే వివిధవర్ణములుగా నేర్పడుటచే వీనికి స్వరములను నామము సార్థకమగుచున్నది. ఉదాత్తాది స్వరభేదములను కలవగుటచేనైనను నివి స్వరములు కావచ్చును. సమానాక్షరములనియు సంధ్యక్షరములనియు నివి రెండు విధములుగా నున్నవి.

౩. అకారము — ముఖమార్గమును స్వల్పముగా తెరచి జిహ్వాద్యవయవములను వానివానిస్థానములయందే యుంచి నాదయుక్తమగు నిశ్శ్వాసమును వదలునప్పు డీవర్ణ మేర్పడుచున్నది. అందుచే నీవర్ణమున కేస్థానముతోడను సంబంధమున్నట్లు తోపదు. అందుచేతనే ప్రాతిశాఖ్యలలో నెచ్చటను నిది కంఠ్యమని చెప్పబడియుండలేదు. పాణినీయవ్యాకరణమున మాత్రము కంఠ్యాచ్చు వేరుగ లేకపోవుటచే కాబోలును దీనికి కంఠము స్థానమని చెప్పబడియున్నది. హ్రస్వాకారము దీర్ఘమువలెకాక సంవృతమని అథర్వవేద వాజసనేయి ప్రాతిశాఖ్యలయందును, పాణినీయవ్యాకరణమునందును చెప్పబడియున్నది. ఇది యుచ్చారణమున నస్పష్టోచ్చ్వాస (అ) పోలియుండును.

అకారమునకు 'ఇండో-యూరపియన్' మాతృ భాషలోని a, e, o, m̥, n̥, అను వర్ణములు మూలమని భాషాశాస్త్రజ్ఞులు నిరూపించియున్నారు. ఉదాహరణములు: సీనిలో నీక్రింది సంజ్ఞలు వ్యవహరింపబడినవి.

ఇం.-యూ.—'ఇండో - యూరపియన్' మాతృభాష.

సం—సంస్కృతభాష

వై.—వైదికభాష

గ్రీ.—'గ్రీక్' భాష-

లా.—'లాటిన్' భాష

గా.—'గాథిక్' భాష

ప్రా. హై. జ.—ప్రాచీన 'హై-జర్మన్' భాష.

ఐస్.—'ఐస్లెండిక్' భాష-

ప్రా. స్లై.—ప్రాచీన 'స్లెవోనిక్' భాష

లి.—'లిథుఏనియన్' భాష.

*—ఈగుర్తు కల్పితరూపమును సూచించును.

ఇం.—యూ. a: సం. అజామి (* అజా), 'తోలుచున్నాను,' గ్రీ. agō, లా. ago, ఐస్. aka (తుమున్నర్థకము.)—వై. అజ్రః, 'పొలము, మైదానము,' గ్రీ. agros, లా. ager, గా. akrs.—సం. అక్షః, 'ఇరుసు,' గ్రీ. axon, లా. axis, ప్రా. హై. జ. ahsa.—సం. కర్కః, కర్కటః 'పీత,' గ్రీ. karkinos, లా. cancer.

ఇం.—యూ. e:—సం. అస్తి 'ఉన్నది', గ్రీ. esti లా. est, గా. ist.—సం. భరామి (* భరా), గ్రీ. pherō, లా. ferō, గా. baira.—వై. జనః 'వంశము, జాతి,' గ్రీ. genos, లా. genus.—సం. చ (సముచ్చయార్థకము), గ్రీ. te, లా. que.—సం. నభః 'మేఘము, ఆకాశము,' గ్రీ. nephos, లా. nebula, ప్రా. హై. జ. nebul.

ఇ.-యూ. o: వై. అష్టా. సం. అష్టౌ 'ఎనిమిది' గ్రీ. oktō, లా. octō, గా. ahtau.—సం. అస్థి 'ఎముక,' గ్రీ. osteon, లా. os.—వై. దమః 'ఇల్లు' గ్రీ. domos, లా. domus.—వై. అపః 'పని,' లా. opus,—సం. దదర్శ, 'చూచెనట,' గ్రీ. dedoske-—సం. భరన్తి 'మోయుచున్నారు,' గ్రీ.—pheronti

ఇం.—యూ. m̥: సం. గతః 'వెళ్లిన,' గ్రీ. batos, లా. -ventus.—సం. శతమ్ 'నూరు,' గ్రీ. e-katon, లా. centum, గా. hund.—సం. దశ, 'పది,' గ్రీ. deka, లా. decem, గా. taihun—వై. సమః 'ఒకరు,' గ్రీ. amo,—గా. sums.

ఇం.—యూ. n̥: సం. మతః 'తలంపు,' గ్రీ.—matos, లా. —mentus, గా. munds.—సం. నవ, 'తొమ్మిది,' గ్రీ. ennea, లా. novem, గా. niun.n సం. అమృత 'అమర్త్య', గ్రీ. ambrotos.—సం. తన్వీ 'సన్నని', గ్రీ. tanu-, లా. tenuis, ప్రా. హై. జ. dunni.

'ఇండో, యూరపియన్' మాతృభాషలో m̥n̥- అను పైనచూపబడిన రెండచ్చులును మకారనకారపరకములగు నచ్చులు లోపించుటచే నేర్పడుచున్నవి. తేల్చి పలుకుటచే నాయచ్చులు లోపించుచుండెను. అందుచే మాతృభాషలో నీరెండచ్చులును యెల్లప్పుడును తేల్చి పలుకబడుచుండినవి. పదాంతరసాహచర్యమువలన స్వల్పసంఖ్యాకములగు పదములలో మాత్ర మివి యొత్తి యుచ్చరింపబడ నారంభించినవి.

ఉదా.—సం. సప్త 'ఏడు,' లా. septem [ఇం.—యూ. * septōm, ప్రాచీనరూపము *[sēptem,]

జన్యభాషలలో పైవర్ణముల విపరిణామములను గూర్చి భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయభేదములను కలిగియున్నారు. సంస్కృతమునందును 'గ్రీక్' భాషయందును రెండు విధములగు విపరిణామములను పొందినవనియు, తద్భిన్న భాషలలో నేకరీతిగా మారినవనియు కొందరి యభిప్రాయము. పదాంతమునందును, యకారవకారభిన్నమగు హల్లునకు పూర్వమునను నివి సంస్కృత 'గ్రీక్' భాషలలో అకారములోనికి మారినవనియు, యకారవకారములకును, అచ్చులకును పూర్వము అమ్, అన్

అను వర్ణములలోనికి మారినవనియును వీరు చెప్పుచున్నారు. మిగిలిన భాషలలో యేవర్ణముపరముగానున్నను నీక్రింది విధముగా మారినవని చెప్పుచున్నారు.

| | |
|---|---|
| లాటిన్. | em, en. |
| జర్మానిక్. | um, un. |
| లిథుఏనియన్ | im, in. |
| ప్రా. స్లేవోనిక్ | ę (im, in). |

మిగిలిన భాషాశాస్త్రజ్ఞులు పైవర్ణము లన్ని సందర్భములలోను సంస్కృతమున అకారములోనికి మారినవని చెప్పుచున్నారు. సంస్కృతమున అమ్, అన్ అను వర్ణఘటితములగు పదముల మాతృభాషా రూపములలో కేవలము లను m̥, n̥. అను వర్ణములుకాక m̥m, n̥n అనువర్ణములుండినవని వీరియాశయము.

పైవర్ణములలో n̥ అనువర్ణముచే కంఠ్య, తాలవ్య, దంత్యవర్ణములు మూడును గ్రహింపవలయును.

౩. ఆకారము:—ఇది హ్రస్వాకారమువలె కాక విస్తృతముగా నుచ్చరింపబడుచున్నది. దీనికి 'ఇండో-యూరపియన్' మాతృభాషలలోని ā ē ō అను వర్ణములు మూలమని భాషాశాస్త్రజ్ఞు లందరును చెప్పియున్నారు. మాతృభాషలో m̥̄ n̥̄ అను దీర్ఘములు కలవనియు, నవికూడ సంస్కృతమున ఆకారముగా పరిణమించినవనియు కొందరు భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. ఉదాహరణములు:

ఇం.—యూ. ā: సం. బాహుః 'చేయి,' గ్రీ. pāchus, ప్రా. హై. జ. buog.—సం. భ్రాతా 'సోదరుడు,' గ్రీ. phrāter, లా. frāter, గా. brōthar—సం. మాతా 'తల్లి,' గ్రీ. māter, లా. māter. ప్రా. హై. జ. muoter.—సం. తిష్ఠామి 'నిలుచుచున్నాను,' గ్రీ. istāmi, లా. stāre.

ఇం.—యూ. ē: సం. ఆద 'తినెను', ఆదివాన్ 'తినిన,' గ్రీ. edēdos, లా. ēdimus, గా. ētum—సం. దధామి 'ఉంచుచున్నాను,' గ్రీ. tithēmi.—సం. ఆసమ్ 'ఉంటిని,' గ్రీ. ēa.—సం. రాజ్ 'రాజు,' లా. rēx.—సం. స్యాః 'ఉండవచ్చును', లా. siēs. గ్రీ. eiēs సం. భ్రాతా, మాతా; పైనచూడుము.

ఇం.—యూ. ō: సం. ఆశుః 'శీఘ్రమైన,' గ్రీ. ōkus, లా. ōcior.—సం. ఆముః 'పండని,' గ్రీ. ōmos —సం. దానం 'దానము,' లా. dōnum.—వై. భరతాత్ 'మోయుము,' గ్రీ. pheretō, లా. fertō.—సం. భరామి (*భరా) 'మోయుచున్నాను,' గ్రీ. pherō, లా. ferō, గా. baira.

ఇం.—యూ. m̥̄: సం. అగాత 'వెళ్లిరి,' గ్రీ. ebāte.—సం. అగాత్, అగాః, అగామ్, గ్రీ. ebē, ebēs, ebēn.

ఇం.—యూ. n̥̄: సం. జాతః 'పుట్టినవాడు, కుమారుడు,' జాతిః 'పుట్టుక,' లా. gnātus, nātus, nātio.—సం. జానామి 'తెలసికొనుచున్నాను,' లా. gnārus.—సం. సాత; వాత; ఘాత; ఘాతి; మొ.

'ఇండో-యూరపియన్' మాతృభాషలో m̥̄, n̥̄ అను అచ్చులుండినవని యంగీకరింపని భాషాశాస్త్రజ్ఞులు పై యుదాహరణము లన్యథాసిద్ధములని చెప్పుచున్నారు. అగాత్, జాత, సాత మొదలగురూపములు ప్రసిద్ధములగు మకారాంత నకారాంత ధాతువులనుండి యుత్పన్నములైనవి కావనియు, తదర్థకములగు ఆకారాంత ధాతుజములనియు వీరి యభిప్రాయము.

౪. ఇకారము—దీని యుచ్చారణమున నాలుక తాలువునకు సమీపముగానుండును. అందుచే నిది తాలవ్యమగుచున్నది. దీనికిని, యకారమునకును వినిమయము కలుగుచుండును. మాతృభాషలోని ఇకారమును యస్పష్టాచ్చును (ə) దీనికి మూలమును-ఉదాహరణములు:

ఇం.—యూ. i సం. ఇమః 'వెళ్లుచున్నాము,' గ్రీ. imen—సం. దివి 'ఆకసమునందు,' గ్రీ. dii.—సం. ఇదమ్ 'ఇది,' లా. id— గా. ita.—సం. అవిః

